# అథ పంచచత్వారింశో%ధ్యాయః

# శివుని సుందర రూపము

బ్రహ్మోవాచ|

ఏతస్మిన్నంతరే త్వం హి విష్ణునా ప్రేరితో ద్రుతమ్ |
అనుకూలయితుం శంభుమయాస్తన్నికటే మునే || 1

తత్ర గత్వా స వై రుద్రో భవతా సుప్రబోధితః | స్తోత్రైర్నానావిధైస్తు త్వా దేవకార్యచికీర్షయా || 2

శ్రుత్వా త్వద్వచనం ప్రీత్యా శంభునా ధృతమద్భుతమ్ | స్వరూప ముత్తమం దివ్యం కృపాలుత్వం చ దర్శితమ్ || 3

తద్ దృష్ట్వా సుందరం శంభుం స్వరూపే మన్మథాధికమ్ |
అత్యహృష్యో మునే త్వం హి లావణ్య పరమాయనమ్ || 4

బ్రహ్మ ఇట్లు పలికెను -

ఓ మునీ! ఇంతలో నీవు విష్ణువుచే ప్రేరితుడై వెంటనే శంభునకు నచ్చజెప్పుటకై ఆయన వద్దకు వెళ్లితివి (1). నీవు దేవకార్యమును చేయగోరి అచటకు వెళ్లి రుద్రుని అనేక విధములగు స్తోత్రములచే స్తుతించి ఆయనకు నచ్చ జెప్పితివి (2). శంభుడు నీ మాటను ప్రీతితో విని తన యాగుణమును ప్రదర్శించువాడై అద్భుతము, ఉత్తమము, దివ్యము అగు రూపమును ధరించెను (3). ఓ మునీ! సుందరము, రూపములో మన్మథుని మించి యున్నది, లావణ్యమునకు పరమనిధానము అగు శంభుని ఆ రూపమును చూచి నీవు చాల ఆనందించితివి (4).

స్తోత్రైర్నానావిధైస్తుస్త్వా పరమానందసంయుతః | అగచ్ఛంస్త్వం మునే తత్ర యత్ర మేనా స్థితాఖిలైః || 5

తత్రా గత్య సుప్రసన్నో మునే%తి ప్రేమసంకులః | హర్షయంస్తాం శైల పత్నీం మేనాం త్వం వాక్యమ బ్రవీః ||

ఓ మునీ! పరమానందమును పొందియున్న నీవు అనేక విధములగు స్తోత్రములచే స్తుతించి మేన ఇతరులందరితో కూడియున్న చోటికి వెళ్లితివి (5). ఓ మునీ! మిక్కిలి ప్రసన్నుడు, అధిక ప్రేమతో నిండియున్న వాడు నగు నీవు అచటకు వచ్చి హిమవంతుని పత్నియగు ఆ మేనను ఆనందింప జేయుచూ ఇట్లు పలికితివి (6).

నారద ఉవాచ |

మేనే పశ్య విశాలాక్షి శివరూప మనుత్తమమ్ | కృతా శివేన తేనైన సుకృపా కరుణాత్మనా || 7

నారదుడిట్లు పలికెను -

ఓ మేనా! విశాలమగు కన్నులు దానా! సర్వోత్తమమగు శివుని రూపమును చూడుము. కరుణా మూర్తి యగు ఆ శివుడు దయను

చూపించినాడు (7).

బ్రహ్మోవాచ|

శ్రుత్వా సా తద్వచో మేనా విస్మితా శైల కామినీ | దదర్శ శివరూపం తత్పర మానందదాయకమ్ || 8

కోటి సూర్య ప్రతీకాశం సర్వా వయవ సుందరమ్ | విచిత్రవసనం చాత్ర నానా భూషణ భూషితమ్ || 9

సుప్రసన్నం సుహాసం చ సులావణ్యం మనోహరమ్ | గౌరాభం

ద్యుతిసంయుక్తం చంద్ర రేఖా విభూషితమ్ || 10

సర్వైర్దేవ గణైః ప్రీత్యా విష్ణ్వా ద్యైస్సేవితం తథా | సూర్యేణ చ్ఛత్రితం మూర్ధ్ని చంద్రేణ చ విశోభితమ్ || 11

బ్రహ్మ ఇట్లు పలికెను -

ఆ మాటను విని హిమవంతుని పత్నియగు మేన ఆశ్చర్యపడి, పరమానందమును కలుగ జేయునది (8). కోటి సూర్యుల కాంతి గలది, అన్ని అవయవముల యందు సుందరమైనది, రంగు రంగుల వస్త్రములు గలది, అనేక భూషణములచే అలంకరింపబడినది (9), మిక్కిలి ప్రసన్నమైనది, చక్కని చిరునవ్వు గలది, గొప్ప లావణ్యము గలది, మనస్సును హరించునది, తెల్లని కాంతులను వెదజల్లునది, చంద్రవంకతో అలంకరింపబడినది (10), విష్ణువు మొదలగు దేవగణములందరిచే సేవింపబడినది, శిరస్సుపై సూర్యుడు ఛత్రముగా కలది, చంద్రునితో ప్రకాశించునది అగు శివుని రూపమును చూచెను (11).

సర్వథా రమణీయం చ భూషితస్య విభూషణైః | వాహనస్య మహాశోభా వర్ణితుం నైవ శక్యతే || 12

గంగా చ యమునా చైవ విధత్తస్స్మ సుచామరే| సిద్ధయో%ష్టౌ పురస్తస్య కుర్వంతి స్మ సునర్తనమ్|| 13

మయా చైవ తదా విష్ణు రింద్రాద్యా హ్యమరాస్తథా | స్వం స్వం వేషం సుసం భూష్య గిరిశేనాచరన్ యుతాః || 14

తథా జయేతి భాషంతో నానారూపా గణాస్తదా | స్వలం కృతా మహామోదా గిరీశపురతో%చరన్ || 15

ఆభరణములతో అలంకరింపబడిన శివుడు అన్ని విధములుగా సుందరుడై యుండెను. ఆయన వాహనము యొక్క గొప్ప శోభను వర్ణింప శక్యముకాదు (12). గంగా యమునలు అందమగు వింజారమలను పట్టిరి. అష్టసిద్ధులు ఆయన యెదట అందముగా నాట్యమాడినవి (13). నేను, విష్ణువు మరియు దేవతలు తమ తమ వేషములను చక్కగా అలంకరించుకొని కైలాస పతితో కలిసి నడచితిమి (14). అపుడు అనేక రూపములు గలవారు, చక్కగా

అలంకరించు కున్నవారు, మహానందముతో గూడిన వారు అగు గణములు జయధ్వానములను చేయుచూ శివుని యెదుట నడిచిరి (15).

సిద్ధాశ్చోపసురాస్సర్వే మునయశ్చ మహాసుఖాః | యయుశ్శివేన సుప్రీతాస్సకలాశ్చాపరే తథా || 16

ఏవం దేవాదయస్సర్వే కుతూహలసమన్వితాః | పరం బ్రహ్మ గృణంతస్తే స్వపత్నీ భిరలంకృతాః ||17

విశ్వావసుముఖాస్తత్ర హ్య ప్సరోగణసంయుతాః | గాయంతో%ప్యగ్రతస్తస్య పరమం శాంకరం యశః || 18

ఇత్థం మహోత్సవస్తత్ర బభూవ మునిసత్తమ | నానావిధో మహేశే హి శైలద్వారి చ గచ్ఛతి || 19

సిద్ధులు, ఉపదేవతలు, మునులు మరియు ఇతరులు అందరు మహానందముతో శివునితో బాటు నడిచిరి (16). ఈ విధముగా దేవతలందరు కుతూహలముతో కూడిన వారై అలంకరించుకొని తమ భార్యలతో గూడి పరబ్రహ్మ యగు శివుని సేవించిరి (17). అచట విశ్వావసువు మొదలగువారు అప్సరసలతో గూడి శంకరుని ఎదుట ఆయనయొక్క ఉత్తమ కీర్తిని గానము చేయుచున్నవారై నడచిరి (18). ఓ మహర్షీ ! ఇట్లు అచట మహేశ్వరుడు హిమవంతుని గృహద్వారము వద్దకు వెళ్లుచుండగా నానా విధములుగా మహోత్సవము సంపన్నమాయెను (19).

తస్మింశ్చ సమయే తత్ర సుషమా యా పరాత్మనః | వర్ణితుం తాం విశేషేణ కశ్శక్నోతి మునీశ్వర || 20

తథావిధం చ తం దృష్ట్వా మేనా చిత్ర గతా ఇవ | క్షణమాసీత్తతః ప్రీత్యా ప్రోవాచ వచనం మునే || 21

ఓ మహర్షీ! ఆ సమయమునందలి పరమాత్మ యొక్క మహాసౌందర్యమును ప్రత్యేకించి ఎవడు వర్ణించ గల్గును? (20) ఓ మహర్షీ! అట్టి ఆ శివుని చూచి మేన క్షణ కాలము చిత్తరువు నందలి మనిషి వలె బిత్తరపోయెను. తరువాత ఆమె ఆనందముతో నిట్లనెను (21).

మేనోవాచ|

ధన్యాపుత్రీ మదీయా చ యయా తప్తం మహత్తపః | యత్ర్ప భావాన్మహే శాన త్వం ప్రాప్త ఇహ మద్గృహే || 22

మయా కృతా పురా యా వై శివనిందా దురత్యయా | తాంక్షమస్వ శివాస్వామిన్ సుప్రసన్నో భవాధునా || 23

మేన ఇట్లు పలికెను -

నా కుమార్తె ధన్యురాలు. ఆమె గొప్ప తపస్సును చేసినది. ఓ మహేశ్వరా! ఆమె తపస్సు యొక్క ప్రభావము వలననే నీవీనాడు నా ఇంటికి వచ్చితివి (22). ఓ పార్వతీ పతీ! నేనింతకు ముందు తప్పించుకొన శక్యము గాని శివనిందను చేసియుంటిని. ఇపుడు నాపై ప్రసన్నుడవు కమ్ము (23).

బ్రహ్మోవాచ |

ఇత్థం సంభాష్య సా మేనా సంస్తూయేందులలాటకమ్ | సాంజలిః ప్రణతా శైలప్రియా లజ్జాపరా%భవత్ || 24

తావత్ స్త్రియస్సమాజగ్మర్హిత్వా కామాననేకశః | బహ్వ్యస్తాః పురవాసిన్య శ్శివదర్శనలాలసాః || 25

మజ్జనం కుర్వతీ కాచిత్త చ్చూర్ణ సహితా య¸° | ద్రష్టుం కుతూహలాఢ్యా చ శంకరం గిరిజావరమ్ || 26

కాచిత్తు స్వామినస్సేవాం సఖీయుక్తా విహాయ చ | సుచామరకరా ప్రీత్యాగాచ్ఛంభోర్దర్శనాయ వై || 27

బ్రహ్మ ఇట్లు పలికెను -

ఆ మేన ఇట్లు పలికి చంద్రశేఖరుని బాగుగా స్తుతించి చేతులు జోడించి నమస్కరించెను. అపుడా హిమవత్పత్ని మిక్కిలి సిగ్గుపడెను (24). ఇంతలో నగరమునందు నివసించు ఎందరో స్త్రీలు శివుని చూడగోరి వివిధ కార్యములను విడిచిపెట్టి బయటకు వచ్చిరి (25). ఒకామె పార్వతీ వరుడగు శంకరుని చూడవలెననే కుతూహలమును పట్టజాలక స్నానము చేయుచూ ఆ చూర్ణముతో సహ బయటకు వచ్చెను (26). ఒకామె భర్త యొక్క సేవను విడనాడి చెలికత్తెతో గూడి చేతిలో అందమగు చామరము ఉండగనే శంభుని దర్శించవలెననే ప్రీతితో వెళ్లెను (27).

కాచిత్తు బాలకం హిత్వా పిబంతం స్తన్యమాదరాత్ | అతృప్తం శంకరం ద్రష్టుం యౖ॰ దర్శనలాలాసా || 28

రశనాం బధ్నతీ కాచిత్తయైవ సహితా యౖ॰ | వసనం విపరీతం వై ధృత్వా కాచిద్యాౖ॰ తతః || 29

భోజనార్థం స్థితం కాంతం హిత్వా కాచిద్యౖ॰ ప్రియా | ద్రష్టుం శివావరం ప్రీత్యా సతృష్ణా సకుతూహలా || 30

కాచిద్ధస్తే శలాకాం చ ధృత్వాంజనకరా ప్రియా | అంజిత్వైకాక్షి సన్ ద్రష్టుం యౖ॰ శైల సుతావరమ్ || 31

ఒకామె స్తన్యమును శ్రద్ధతో త్రాగు చున్న బాలకుని వాడు తృప్తి చెందకుండగనే విడిచిపెట్టి శివుని దర్శించవలెననే ఉత్కంఠతో వెళ్లెను (28). ఒకామె బంగరు మొలత్రాటిని కట్టు కొన బోయి అది చేతి యందుండగనే వెళ్లెను. ఒకామె చీరను తల్ల క్రిందలుగా ధరించి వెళ్లెను (29).ఒకామె పార్వతీవరుని చూడవలెననే తృష్ణతో,కుతూహలముతో, ప్రీతితో భోజనమునకు కూర్చున్న భర్తను

విడిచి వెళ్లెను(30). ఒకామె చేతియందు కాటుకక భరిణను పట్టుకొని ఒక కన్నుకు మాత్రమే కాటుక నిడి ఇంతలో పార్వతీ వరుని చూచుటకై అదే భంగిమలో వెళ్లెను(31).

కాచిత్తు కామినీ పాదౌ రంజయంతీ హ్యాలక్తకైః | శ్రుత్వా ఘోషం చ తద్ధిత్వా దర్శనార్థము పాగతా|| 32

ఇత్యాది వివిధం కార్యం హిత్వా వాసం స్త్రియో యయుః| దృష్ట్వా తు శాంకరం రూపం మోహం ప్రాప్తాస్తదా%భవన్|| 33

తతస్తాః ప్రేమ సంవిగ్నా శ్శివదర్శనహర్షితాః| నిధాయ హృది తన్మూర్తిం వచనం చేదమబ్రువన్|| 34

ఒక సుందరి పాదములను లత్తుకరంగుతో దిద్దు కొనుచూ ఊరేగింపు శబ్దమును విని ఆ పనిని పెట్టి శివుని చూచుటకు వెళ్లెను (32). స్త్రీలు ఇత్యాది వివిధ కార్యములను విడిచి పెట్టి చేతిలోని వస్త్రమును క్రింద బారవైచి వెళ్లిరి. వారపుడు శంకరుని రూపమును చూచి మోహమును పొందిరి (33). అపుడు వారు శివుని చూచి ఆనందించి ప్రేమతో నిండిన హృదయము గలవారై ఆ శివుని రూపమును హృదయమునందిడు కొని ఈ మాటలను పలికిరి (34).

పురవాసిన్య ఊచుః |

నేత్రాణి సఫలాన్యాసన్ హిమవత్పురవాసినామ్ | యో యో%పశ్య దదో రూపం తస్య వై సార్థకం జనుః || 35

తస్మై#్యేవ సఫలం జన్మ తస్మై#్యేవః సఫలాః క్రియాః | యేన దృష్ట శ్శివస్సాక్షా త్సర్వ పాప ప్రణాశకః || 36

పార్వత్యా సాధితం సర్వం శివార్థే యత్తపః కృతమ్ | ధన్యేయం కృతకృత్యేయం శివా ప్రాప్య శివం పతిమ్ || 37

యదిదం యుగలం బ్రహ్మే న యుం జ్యాచ్ఛివ యోర్ముదా | తదా చ సకలో%ప్యస్య శ్రమో నిష్ఫలతామియాత్ || 38

పురస్త్రీలు ఇట్లు పలికిరి -

హిమవంతుని నగరమునందు నివసించు పౌరుల కన్నులు సార్థకమాయెను. ఎవరెవరైతే ఈ రూపమును చూచిరో, వారి వారి జన్మలు సార్థకమాయెను (35). సర్వ పాపములను పోగొట్టు శివుని ఎవరైతే ప్రత్యక్షముగా దర్శించెదరో వారి జన్మ మాత్రమే సఫలము. వారి కర్మలు మాత్రమే సఫలము లగును (36). శివుని కొరకు తపస్సును చేసి పార్వతి సర్వమును సాధించినది. ఈమె ధన్యురాలు. శివుని భర్తగా పొందిన ఈ పార్వతి కృతకృత్యురాలు (37) సృష్టి కర్త ఆనందముతో ఈ పార్వతీ పరమేశ్వరుల జంటను కలుపక పోయినచో, అపుడాతని శ్రమ అంతయూ నిష్ఫలమై యుండెదిది (38).

సమ్యక్ కృతం తథా చాత్ర యోజితం యుగ్మముత్తమమ్ | సర్వేషాం సార్థతా జాతా సర్వకార్యసముద్భవా || 39

వినా తు తపసా శంభోర్దర్శనం దుర్లభం నృణామ్ | దర్శనాచ్ఛంకరసై#్యవ సర్వే యాతాః కృతార్థతామ్ || 40

లక్ష్మీర్నారాయణం లేభే యథా వై స్వామినం పురా | తథాసౌ పార్వతీ దేవీ హరం ప్రాప్య సుభూషితా || 41

బ్రహ్మాణం చ యథా లేభే స్వామినం వై సరస్వతీ | తథాసౌ పార్వతీ దేవి హరం ప్రాప్య సుభూషితా || 42

ఈ ఉత్తమమగు జంటను కలిపి బ్రహ్మ మంచి పని చేసినాడు. అందరు చేసిన కర్మలన్నియూ ఈ కలయికచే సార్థకమైనవి (39). మానవులకు తపస్సు చేయనిదే శివుని దర్శనము లభించదు. మానవులందరు శివుని దర్శనము చేత మాత్రమే కృతార్థులగుదురు (40). పూర్వము లక్ష్మి నారాయణుని భర్తగా పొందిన తీరున, సరస్వతి బ్రహ్మను భర్తగా పొందిన తీరున ఈ పార్వతీ దేవి శివుని భర్తగా పొంది మిక్కిలి ప్రకాశించుచున్నది (41, 42).

వయం ధన్యాః స్త్రియ స్సర్వాః పురుషాస్సకలా వరాః | యేయే
పశ్యంతి సర్వేశం శంకరం గిరిజా పతిమ్ || 43

మనము స్త్రీలమందరము ధన్యులము. పురుషులందరు ధన్యులు
ఎవరెవరైతే సర్వేశ్వరుడు, గిరిజాపతి యగు శంకరుని దర్శించెదరో
వారందరు ధన్యులు (43).

బ్రహ్మోవాచ |

ఇత్థముక్త్వా తు వచనం చందనైశ్చాక్షతైరపి | శివం సమర్చ
యామాసు ర్లాజాన్ వవృషు రాదరాత్ || 44

తస్థుస్తత్ర స్త్రియస్సర్వా మేనయా సహ సోత్సుకాః |
వర్ణయంతో%ధికం భాగ్యం మేనాయాశ్చ గిరేరపి || 45

కథాస్తథావిధాశ్శృణ్వన్ తద్వామావర్ణితాశ్శుభాః | ప్రహృష్టో%భూత్
ప్రభుస్సర్వైర్మునే విష్ణ్వాదిభిస్తదా || 46

ఇతి శ్రీ శివ మహాపురాణ   రుద్రసంహితాయాం పార్వతీ ఖండే
శివసుందర స్వరూప వర్ణనం నామ పంచ చత్వారింశో%ధ్యాయః
(45).

బ్రహ్మ ఇట్లు పలికెను -

ఇట్లు పలికి వారు గంధముతో, మరియు అక్షతలతో శివుని పూజించి
సాదరముగా పేలాలను వర్షించిరి (44). ఆ స్త్రీలందరు మేనతో గూడి
ఉత్సుకతతో అచట నిలబడిరి. వారు మేనా హిమవంతుల
మహాభాగ్యమును వర్ణించుచుండిరి (45). ఆ స్త్రీలచే వర్ణింపబడిన
అటువంటి శుభగాథలను శివుడు వినుచుండెను. ఓ మహర్షీ !
శంభుడు విష్ణువు మొదలగు వారందరితో గూడి అపుడు చాల
ఆనందించెను (46).

శ్రీ శివ మహాపురాణములోని రుద్ర సంహిత యందు పార్వతీ ఖండలో శివసుందర స్వరూప వర్ణనమనే నలుబది అయిదవ అధ్యాయము ముగిసినది (45).